


లొయోలా పబ్లిక్ స్కూల్,
నల్లపాడు వారి సౌజన్యంతో


9 789357 739306

బాల సాహిత్య చరిత్రలో మొదటిసారిగా
బాలల చేత రచించబడిన కవితా సంపుటి

# అమ్మకు అక్షరాభిషేకం



ప్రధాన సంపాదకులు

**డా॥ దాసరి రమేష్**

తెలుగు సాహిత్యంలోనే మొదటి సారిగా బాలల చేత
రచించబడిన వచన కవితా సంపుటి

# అమ్మకు అక్షరాభిషేకం

## సంపాదక వర్గం

1. శ్రీమతి. ఆదిలక్ష్మీ దేవి
2. శ్రీమతి. కె. ఎన్. విజయలక్ష్మీ
3. శ్రీమతి. బాల చాముండేశ్వరి
4. శ్రీ. రంగనాథ్ బాబు
5. శ్రీ. భాస్కర్ రావు
6. శ్రీ. టి. జోసెఫ్ కుమార్
7. శ్రీ. ఏ. వేళంగిణి రాజు
8. శ్రీ. స్వర్ణ మణికంఠ
9. శ్రీ. డా॥ బి. ఎం. ఎం. ఆర్. ఎస్. టి. కె. ఆచార్యులు వేదాంతం

## ప్రధాన సంపాదకులు

## డా॥ దాసరి రమేష్

**అమ్మకు అక్షరాభిషేకం**

(వచన కవితా సంకలనం)

సంపాదకులు

**డా॥ దాసరి రమేష్**

**ప్రథమ ముద్రణ:** డిసెంబర్ 2022

ISBN: 978-93-5773-930-6

**వెల: 125/-**

**ప్రతులకు:**

ఏంజల్స్ ప్రచురణలు,
H.no: 3-79,
ప్రత్తిపాడు, గుంటూరు,
సెల్: +91 9010693883.
మెయిల్: vipparlasuneethapraizy@gmail.com





*Thanks to our precious correspondent*



## REV. FR. DR|| P. ANTONY REDDY, S.J.,

**(SUPERIOR & CORRESPONDENT)**

*Thanks to our precious Principal*



## REV. FR. B. SURESH KUMAR, S.J.,

**(PRINCIPAL & TREASURER)**

# విజయీభవ!!



"మనిషిగా పుట్టటం గొప్ప కాదు

మనిషిగా బ్రతకడం గొప్ప

మనీషిగా బ్రతికించడం గొప్ప"

మనిషిని పశుత్వం నుండి మానవత్వం వైపు మరల్చేది, మనిషి మనిషిగా బ్రతకడమే కాక మనీషిగా ఎదిగేటట్లు చేసేది, చేయించేది విద్యాలయాలే, ఆ ఆలయంలోని దేవతామూర్తులైన గురువులే. మనిషిగా, మనీషిగా, మహోన్నతుడిగా తయారయ్యేది విద్యార్థులే. ప్రతి గురువు తమ

శాయశక్తుల కృషిచేసి వారి వారి అంశాలలో సబ్జెక్టులో విద్యార్థులను ఉన్నతంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తారు. అది గురువుల సహజ గుణం. విద్యార్థులందరూ గురువులు చెప్పింది అర్థం చేసుకుని, అధ్యయనం చేసి, విజ్ఞానవంతులుగా ఎదగడానికి ప్రయత్నం చేయాలి. అది వారికి ఉండాల్సిన సహజ గుణం. ఆ విద్యాలయం యొక్క సమస్త బాధ్యతలను మోస్తూ, సక్రమంగా నిర్వహించవలసిన బాధ్యత ఆయా విద్యాలయాల ప్రధానోపాధ్యాయులు, యాజమాన్యం వారిది. ఇది వారికి ఉండాల్సిన సహజ గుణం. ఈ సహజ గుణాలన్నీ కలగలిసిన విద్యాలయం లొయోలా పాఠశాల. ఆ గుణాలు లేకపోతే ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న ఈ కవితా సంపుటి వచ్చేది కాదు. అందుకు విద్యాలయానికి అభినందనలు. పాఠశాల స్థాయిలో, చిన్ని విద్యార్థుల స్థాయిలో ఓ కవిత సంపుటి బయటకు రావడం అంటే అభినందనలే కాదు ఆనందాశ్చర్యాలను ప్రకటించాల్సిన సందర్భం. అది కూడా అమ్మను గురించిన కవితలంటే..

'అమ్మలోని కమ్మదనాన్ని
అమ్మలోని దేవతను
అమ్మలోని త్యాగమూర్తిని
గుర్తించి, గౌరవించి
అమ్మకు
పాదాభివందనం చేయడమే.'

‘ ఆ పాద పూజ

ఈ పసి చేతుల చేత

ఆహా! అమ్మ జన్మ చరితమాయే

ఈ పసిజన్మలు ధన్య మాయే’

పసితనము నుండి వృద్ధాప్యం వరకు, చనిపోయేంతవరకు అమ్మ ఓ మధుర జ్ఞాపకం. అమ్మవి ఇంకా ఎన్నో జ్ఞాపకాలను పొందవలసిన ఈ పసి బాలలు ఇప్పటివరకు పొందిన త్యాగమయి అమ్మ జ్ఞాపకాలను గుర్తుంచుకొని వాటికి అక్షర రూపం ఇచ్చి ఆదర్శంగా నిలిచారు. వారి మాటలలో అమ్మ...

**“ కనులు తెరిచిన క్షణం**

**కనపడే రూపం” – SK.కరిష్మ**

**“అమ్మ సృష్టిలో ఒక అద్భుతం**

**అమ్మతో ఉంటే మనసు నిర్భరం” – రుత్విక్**

ఇలా 48 మంది విద్యార్థినీ విద్యార్థులు అమ్మను వర్ణించటం గొప్ప విశేషం తెలుగు భాష మీద మమకారం, కవిత్వం మీద శ్రద్ధ పెరగడమే. వారిని ఆ విధంగా తీర్చిదిద్దిన వారి ప్రియతమ ఉపాధ్యాయుడైనటువంటి డాక్టర్. దాసరి రమేష్ ను తప్పనిసరిగా అభినందించాల్సిందే. రమేష్ విద్యార్జనలో, పరిశోధనలోనే మేటి కాదు ఉపాధ్యాయుడుగాను శ్రేష్ఠి అని నిరూపించుకున్నాడు. ఈ కాలానికి, ఈ సమాజానికి కొత్త తరం కవులను తయారు చేస్తున్న డాక్టర్ రమేష్ కు, ఈ

విధంగా కవితా సంపుటి వెలువరించడంలో అతనికి ఎంతో సహకరించిన పాఠశాల యాజమాన్యానికి అభినందనలు తెలుపుతూ....

ఇది బాలల కవిత్వం. 7, 8, 9 తరగతుల విద్యార్థులు రాసిన కవిత్వం. నాకు తెలిసినంత వరకు ఇదే మొదటి బాలల కవిత్వంగా పరిగణించవచ్చు.

"ఇందులోని తప్పొప్పులు ఎంచక

వారి పసి మనసును గమనిద్దాం

అమ్మ భావాన్ని గ్రహిద్దాం

సుమనస్సుతో

విజయీభవ అని దీవిద్దాం!!"

**ప్రొ. నారిశెట్టి వెంకట కృష్ణా రావు**

ఆచార్యులు,

తెలుగు మరియు ప్రాచ్య భాషా విభాగం,

ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం.

# ఆదర్శమూర్తికి అక్షర నీరాజనం




సృష్టిలో అమ్మను మించిన దైవం తల్లి ప్రేమకి సాటిరాగల ఏ ప్రేమ సృష్టిలో లేదు. అమ్మ ఉన్న ఇంటిలో అసలు లేనిది ఏది? దేవుడు లేడు అనేవాడు ఉన్నాడు గాని అమ్మ లేదు అనేవారు ఎవరూ ఉండరు. కల్మషం లేకుండా, హృదయం అంతా ప్రేమతో నింపి దానిని అందరికీ పంచి పెట్టె మాతృ మూర్తి అమ్మ. ఎన్ని జన్మలెత్తిన అమ్మ ఋణం తీర్చుకోలేం. అన్ని బంధాలలో అత్యంత గొప్ప అనుబంధం అమ్మ. అమృతం కన్నా తియ్యనైన పదం అమ్మ. ఈ అనంత సృష్టిలో అతి తెలివిగల, మధురమైన, మహోన్నతమైన పదం ఏదైనా ఉంది అంటే అది అమ్మ. అవతార పురుషుడైన ఆ అమ్మకు కొడుకే. ఏ స్వార్థం లేకుండా

ప్రేమను పంచి ఇచ్చే కరుణామయి అమ్మ. ప్రపంచంలో అందరికంటే అదృష్టవంతుడు ఎవరంటే అమ్మ ప్రేమను సంపూర్ణంగా పొందే వాళ్ళే అని నేనంటున్నాను.

అమ్మ స్ఫూర్తితో తమకు వచ్చిన చిన్ని, చిన్ని పదాల అల్లికతో అంతులేని ప్రేమతో అక్షర మాలికలను కూర్చిన మన పాఠశాల విద్యార్థుల ప్రతిభకు, సృజనాత్మకతకు ఒక తెలుగు ఉపాధ్యాయురాలిగా నేను ఎంతో ఆనందిస్తున్నాను. విద్యార్థులకు వెన్నెముకలా నిలిచి వారిలోని ప్రతిభకు పదును పెట్టి, వారి వెనుక నిలిచి, వారికి కావలసిన సహాయ సహకారాలను అందిస్తూ, వారి అభిరుచిని వెలికి తీసిన నా తోటి ఉపాధ్యాయుడు, ఈ పుస్తక రూపానికి కారకుడైన డా॥ రమేష్ గారికి నా అభినందనలు. విద్యార్థులకు నా ఆశీర్వచనాలు.

అభినందనలతో..

**నాగ విజయలక్ష్మి**,
తెలుగు ఉపాధ్యాయురాలు,
లొయోలా విద్యా సంస్థలు.

# అమృత మూర్తికి అక్షర నీరాజనం



అమ్మ అనేది కేవలం రెండు అక్షరాలు మాత్రమే కానీ అర్థం, పరిధి అనేది అనిర్వచనీయమైనది. అందుకనే అమ్మంటే అనురాగం, ఆత్మీయత, ఆదర్శం, త్యాగం, తియ్యదనం, కమ్మదనం ఇంకా ఎన్నో .. ఎన్నెన్నో. అమ్మ గురించి ఎంత చెప్పినా తక్కువే మాటలకు అందనిది, రాతలకు చిక్కనిది అమ్మ ప్రేమ ఒక్కటే. ఈ ప్రపంచంలో డబ్బు లేని వాడు పేదవాడు కాదు. అమ్మ లేని వాడు అతి పేదవాడు. అమ్మ నవమాసాలు మోయడమే కాదు ఆజన్మాంతం తన గుండెలలో మోస్తుంది. తన బిడ్డను ఒక వ్యక్తిగానే కాక ఒక వ్యవస్థగా తయారు చేసి ఉత్తమ సమాజ నిర్మాణానికి దోహదపడే ఒక ఆయుధాన్ని అందిస్తుంది.

అటువంటి అమ్మను గురించి, అమ్మ స్ఫూర్తితో తమకు వచ్చిన చిన్ని, చిన్ని పదాలను కూర్చి అంతులేని ప్రేమతో అక్షర మాలికలను తయారు చేసి ఆ అమ్మ పాదాలను అలంకరించిన మన లొయోలా పబ్లిక్ స్కూల్, నల్లపాడు విద్యార్థుల ప్రతిభకు, సృజనకు, భాషాభిరుచికి ఒక తెలుగు ఉపాధ్యాయురాలిగా నేను ఎంతో గర్విస్తున్నాను. విద్యార్థులకు వెన్నంటి ఉండి, వారిలోని సృజనకు పదును పెట్టి, వారికి తన సహాయ సహకారాలను అందిస్తూ వారిలోని అభిరుచిని వెలికి తీసిన నా తోటి ఉపాధ్యాయుడు, ఈ పుస్తక రూపకల్పనకు కారకులైన డా॥దాసరి రమేష్ గారికి, వారికి సహకరించిన మా ఉపాధ్యాయ మిత్రులకు నా అభినందనలు. ఇలాంటివి ఆయన చేతుల మీదుగా ఇంకా ఎన్నో, ఎన్నెన్నో రావాలని ఆకాంక్షిస్తున్నాను.

ఇట్లు

**బాల చాముండేశ్వరి**

తెలుగు ఉపాధ్యాయురాలు,
లొయోలా విద్యా సంస్థలు.

# వచన కవిత పరమార్థం



బాల బాలికల మెదళ్లు ఆలోచనల తేనె తుట్టెలు. జాగ్రత్తగా ఆ తుట్టెలను కదిలిస్తే చాలు మధురమైన మధువును గ్రోలవచ్చు. వారిని పలుకరిస్తే చాలు ఎన్నో విషయాలపై మాట్లాడుతారు. అవకాశమిస్తే చాలు వివిధ అంశాలపై ప్రశ్నిస్తారు. సందేహాలు వెలిబుచ్చుతారు. ఈ సందేహాలకు, ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి వారి తల్లిదండ్రులు కూడా ఇబ్బంది పడతారు. ఉపాధ్యాయులు కూడా ఒక నిమిషం ఆలోచించాల్సిందే! వారు చెప్పే సమాధానాలు బాల బాలికలను తృప్తి పరచవు. కారణం విద్యార్థుల నిరంతర ఆలోచనా ధోరణి.

విద్యార్థులలోని ఆలోచనలను క్రమబద్ధం చేసి, ఒక విస్పష్టమైన ఆకృతిని కల్పించడానికి అనుసరించ దగ్గ వ్యూహాల్లో "రచన" చేయించడం ఒకటి. వాగ్రూపంలోగాని, లిఖిత రూపంలోగాని దోష రహితమైన వ్యక్తీకరణానికి రచన ఉపకరిస్తుంది. వాగ్రూప రచన అస్థిరమైనది. లిఖిత రచన శాశ్వతమైనది. రచన చేయడం ఒక నైపుణ్యం.

విజ్ఞులైన ఉపాధ్యాయులు, సహృదయులైన లొయోలా పాఠశాల యాజమాన్యము, పరిశీలనాసక్తులైన విద్యార్థుల సమ్మేళనముతో "అమ్మకు అక్షరాభిషేకం" వచన కవిత అంకురించింది. ఈ పుస్తక రూపకల్పనలో ఎంతో శ్రమించిన మాన్యులు శ్రీ రమేష్ గారి కృషి ఎనలేనిది. ఈ పుస్తకాన్ని ఆద్యంతం చదివి తమ అమూల్యమైన ఆశీస్సులను అభినందనల రూపంలో బాల బాలికలకు సహృదయంగా అందించవలసిందే. తల్లీ, తండ్రీ, గురువు – ప్రత్యక్ష దైవాలు. అందులో తల్లి ప్రేమ అపురూపం, అలౌకికం, అనిర్వచనీయం.

అభినందనలతో ..

**పరుచూరి రంగనాథ బాబు** ,

తెలుగు భాషా పండితులు,

లొయోలా విద్యాసంస్థలు

# తొలి ప్రయత్నానికి శ్రీకారం



శతాబ్దాల చరిత్ర కలిగినది తెలుగు సాహిత్యం. ఆ చరిత్రలో ఎన్నో కొత్తదనాలు, ఎన్నో మార్పులు జరుగుతూ సాహిత్యం కొత్త పుంతలు తొక్కుతూ వచ్చింది. ఆధునిక కాలంలో వచ్చిన సాహిత్య ప్రక్రియలలో ఒకటైన కథ, వచన కవిత్వం అనేవి చాలా వరకు రచనాసక్తులను ప్రోత్సహించాయనడంలో సందేహం లేదు. ఎందరో రచయితలు మరికొన్ని నూతన ప్రక్రియలను ప్రారంభించి సాహిత్యానికి కొత్త సొబగులు దిద్దారు. నేడు కవిత్వ రచనకు వయస్సుతో పనిలేదు. 'నూనూగు మీసాల నూత్న యవ్వనంబున

శ్రీనాధుడు మరుత్తరాట్చరిత్ర రచించాడు' అనాడు. అసలు మీసమనే ఆలోచన కూడా రాని దశలోనే కవిత్వ రచనకు పూనుకున్నారు మా స్కూల్ విద్యార్థులు.

గుంటూరులోని నల్లపాడులో గల లొయోలా పబ్లిక్ స్కూల్ విద్యార్థులు చేసిన తొలి ప్రయత్నమిది. విద్యార్థులలో విజ్ఞానాన్ని మాత్రమే నింపేవి ఇతర శాస్త్ర గ్రంథాలు, పాఠ్య పుస్తకాలు అయితే, విద్యార్థికి విలువలతో బ్రతకడం నేర్పేవి తెలుగు పాఠ్య పుస్తకాలు మాత్రమే. తెలుగు వాచకాల్లో ఉన్న ప్రతీ పాఠం విద్యార్థికి సమాజం పట్ల తల్లిదండ్రుల పట్ల సదాలోచనలను కలిగిస్తుంది. ఉత్తమ పౌరుడిగా బ్రతికేలా తీర్చిదిద్దుతాయి. అన్ని తరగతులలో తెలుగులో మొదటి పాఠ్యాంశంగా అమ్మ గురించే ఉంటుంది. అమ్మ మన జీవితంలో మొదటి వ్యక్తి. ఆమె తోనే మన జీవితం ప్రారంభమవుతుంది. అమ్మను గురించి, ఆమె వ్యక్తిత్వం గురించి ఇప్పటికే ఎందరో కవులు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. ఆమె త్యాగాన్ని వర్ణించడానికి మాటలు చాలవు. అమ్మను గూర్చిన పాఠ్యాంశ బోధనలో భాగంగా విద్యార్థులకు అమ్మను గురించి మీ మాటల్లో కవిత రూపంలో రాయమని ప్రోత్సహించగానే కొందరు విద్యార్థులు ముందుకు వచ్చారు. వారు రాసిన కవితల సమాహారమే ఈ కవిత సంపుటి.

కవితలు రాసింది చిన్న పిల్లలే, కవిత్వం ఎలా రాయాలో చెప్పడం మాత్రమే మా ఉపాధ్యాయులం ఇచ్చిన సలహాలు. ఆలోచన అంతా విద్యార్థులదే. ఇప్పటివరకు తెలుగు సాహిత్యంలో ఎన్నో కవితా సంపుటాలు, కావ్యాలు వచ్చి ఉండవచ్చు కానీ తెలుగు సాహిత్యంలో మొదటిసారిగా విద్యార్థుల చేత రచించబడి ప్రచురించబడిన మొదటి కవితా సంపుటి ఇదే అనడంలో సందేహం

లేదు. తెలుగు సాహిత్య చరిత్రలో ఇది మొదటి ప్రయత్నమే. బాల సాహిత్యంలో కూడా ప్రధానమైనదిగా చెప్పవచ్చు. ఇప్పటివరకు బాలల కోసం పెద్దలు రచనలు చేస్తే, బాలలే రచయితలుగా మారి చేసిన రచన ఇది. ఇది మరెందరికో ప్రేరణ అవ్వాలి. ప్రతి పాఠశాలలోనూ ఎందరో కొందరు విద్యార్థులు రచనాసక్తిని కలిగి ఉంటారు. వారికి కొద్దిగా ప్రోత్సాహమిస్తే చాలు వారు మనసులోని భావాలను ఆవిష్కరించగలుగుతారు. ఎంతో చక్కగా అమ్మ మీద తమకున్న అభిప్రాయాలను అలవోకగా తెలియజేసిన మా విద్యార్థుల కవితలను ఏ ఒక్కటి తీసివేయకుండా అన్నింటినీ పుస్తకరూపంలో వారికి చిరస్మరణీయంగా గుర్తుండిపోవాలని మా ఉపాధ్యాయుల బృందం అంతా కలసి చేసిన ప్రయత్నమిది. ఉపాధ్యాయులుగా మేము చేసినది వారి అక్షర దోషాలని సరి చేయడం, తప్పులు సరిదిద్దటం మాత్రమే. ఇంత చిన్న వయసులోనే తల్లిదండ్రుల పట్ల మంచి వైఖరులను అలవరచుకోవడం కూడా మంచిదే.

చాలా వరకు పాఠశాల యాజమాన్యాలు కోరేది విద్యార్థుల మార్కులు, ర్యాంకులు సాధించాలనే ప్రయత్నం తప్ప వైఖరుల అభివృద్ధికి ప్రాధాన్యతనివ్వవు. ఎంత సేపు మార్కులు, ర్యాంకులు అంటూ వారిలోని ఆలోచనా శక్తికి ప్రాధాన్యతనివ్వక యాంత్రికంగా మార్చేస్తుంటారు. కానీ విలువలతో కూడిన అభ్యాసానికి ప్రాధాన్యతనిస్తూ, విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధి కలిగించేలా వారిలోని ఆలోచనలను ఎప్పటికప్పుడు ప్రోత్సహిస్తూ, చదువంటే నాలుగు గోడల మధ్యన నేర్చుకునేది కాదని, అన్ని విషయాల పట్ల అవగాహన కలిగించాలని, ఆ దిశగా వారిని ప్రోత్సహించే లొయోలా పబ్లిక్ పాఠశాల యాజమాన్యం పిల్లల కవితలను పుస్తక రూపంలో

అందించాలనుకుంటున్నాం అనే ఆలోచన చెప్పగానే మమ్మల్ని ప్రోత్సహించి ముందుకు నడిపించారు. అందుకు వారికి మా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ ఆలోచన చెప్పగానే ఎటువంటి సందేహాలకు తావివ్వక నాతో చేతులు కలిపి విద్యార్థులను కవిత్వ రచనకు ప్రోత్సహించిన మా తెలుగు ఉపాధ్యాయ కుటుంబానికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను. వారు సహకరించకపోతే ఈ ప్రయత్నం ముందుకు నడిచేది కాదు. అన్నింటికీ మించి దేవుని ఆశీర్వచన బలంతో సాగింది.

ఈ కవితా సంపుటిని చదివి పాఠకులు, విమర్శకులు, సాహిత్యాభిమానులు తమ అమూల్యమైన అభిప్రాయాలు, సలహాలు, సూచనలు అందించినట్లయితే ప్రేమతో స్వీకరించగలవారము. అందరూ అమ్మ గురించే కదా రాసింది, ఇప్పటికే ఎందరో వర్ణించారు, ఇంక కొత్తగా వీళ్ళేంచేశారు? వాటిల్లో కొత్తదనమేమున్నదని అనుకోకుండా పిల్లలుగా వారు చేసిన తొలి ప్రయత్నానికి ఆశీస్సులు అందించగలరని ఆశిస్తున్నాము.

ప్రేమతో ..

**డా|| దాసరి రమేష్,**
ప్రధాన సంపాదకులు,
తెలుగు ఉపాధ్యాయుడు,
లొయోలా విద్యా సంస్థలు

# విషయ సూచిక

## 1. హద్దులు లేనిది



అమ్మ ఉన్న చోట ఆకలుండదు

ఆమె జోల పాటలతో అలసట ఉండదు...

స్వచ్ఛమైన ప్రేమకు లోటు ఉండదు,

ఆమె దీవెనుంటే ఎప్పుడు ఓటముండదు

అమ్మలేక దేవుడైన లేడు

ఆమె లేకపోతే సృష్టి కూడా లేదు

పదాలు రాని నా పెదవులకు అమృత వాక్యం అమ్మ

ఆమె చల్లని  ఒడిలో మొదలైంది ఈ జన్మ

ప్రపంచంలో దేనికైనా హద్దులు ఉంటాయి

అమ్మ ప్రేమకు హద్దులు సరిహద్దులు

లేనే లేవు .. ..

దేవుడు అంతట ఉండేందుకు

అందరినీ సమానంగా చూసేందుకు

అందరికి ప్రేమను పంచేందుకు

ఒక అవతారమెత్తి ఇవన్నీ చేశాడు

ఆ కమ్మని పలుకే అమ్మ

నా కిచ్చింది అందమైన జన్మ ..

అమితమైన ప్రేమ అమ్మ

అంతు లేని అనురాగం అమ్మ

అలుపెరుగని ఓర్పు అమ్మ

అద్భుతమైన స్నేహం అమ్మ

అపురూపమైన కావ్యం అమ్మ

అరుదైన రూపం అమ్మ

– టి. యశ్వంత్ సాయి

8TH C సెక్షన్

## 2. కనులు తెరచిన క్షణం



కనులు తెరచిన క్షణం

కనపడే రూపం అమ్మ

తన ఆత్మ శరీరం పంచి

మనకు జన్మనిచ్చిన దివ్య రూపం అమ్మ

రక్తాన్ని పాలుగా మార్చి

మన ప్రాణం నిలుపుతుంది అమ్మ

నా మౌనం, మనోవేధన సైతం

అర్థం చేసుకోగలదు అమ్మ

మన ప్రాణానికి తన ప్రాణం అడ్డు వేయడానికి

ఏ మాత్రం వెనుకాడనిది అమ్మ

తనవన్ని త్యాగం చేస్తూ

మన ఎదుగుదల కోరుకుంటుంది అమ్మ

మన పెదవిపై చిరునవ్వు

అది తన గెలుపుగ భావించేది అమ్మ

చివరి క్షణం వరకు

అనుక్షణం నీకై బ్రతుకుతుంది అమ్మ

చివరి శ్వాస నిన్ను చూస్తూ

నీ చేతుల్లో ఒదగాలని తపించిపోతుంది అమ్మ

– షేక్. కరిష్మ

8TH C సెక్షన్

## ౩. అమ్మ ఒక అద్భుతం



అమ్మ  సృష్టిలో ఒక అద్భుతం

అమ్మతో ఉంటే మనసు నిర్భరం

అమ్మ లేకుంటే అదొక దుర్భరం

అమ్మ నాకు మొదటి గురువు

అమ్మ పదం వినసొంపు

అమ్మని చూస్తే మనసు శాంతం

ఆమెని తలచిన ప్రశాంతం

అమ్మ పొదుపు నాకు తరువు

అమ్మ ధైర్యం నాకు మార్గం

అమ్మ త్యాగం నా భవితం

అమ్మ కోపం నాకు శాపం

అమ్మ మాటలోని కమ్మదనం

అమ్మ ప్రేమలోని స్వచ్ఛదనం

అమ్మ చూపులోని చల్లదనం

నింపును జగతిలో పచ్చదనం

అమ్మ మనసులోని మమత

నా భవితకు తెచ్చును ఘనత

ఎన్నడూ విడిపోని అనుబంధం

అమ్మ సృష్టికే సృష్టినిచ్చు శక్తి

– పి. రుత్విక్
$8^{TH}$ C సెక్షన్

## 4. అమ్మ ఋణం



అమ్మ అంటే అనురాగం

అమ్మ అంటే ప్రేమ

చిన్నప్పుడు మనలను ఆడించేది అమ్మ

పాడించేది అమ్మ

నా క్షేమమే కోరుతుంది

నా కోసమే శ్రమిస్తుంది

నా భవిష్యత్తునే చూస్తుంది

ప్రాణాలిచ్చేంతగా పరితపిస్తుంది

అమ్మ దేవుడితో సమానం

చెడు దారిలో వెళ్ళకుండా కాపాడుతుంది

ఎన్నో కథలను చెప్తుంది

బిడ్డల ఆనందమే కోరుతుంది

ఆమె ప్రేమ వెలకట్టలేనిది

మనలను తన గర్భంలో నవమాసాలు మోసి

ఎన్నో బాధలను ఓర్చి, బిడ్డలకు ఊపిరిపోస్తుంది

అమ్మకు అమ్మై పుడితే తప్ప

అమ్మ ఋణం తీర్చుకోలేనిది

– వి. బాల సాయి భాస్కర్ రెడ్డి, 7TH J సెక్షన్

## 5. అమితమైన ప్రేమ



అమితమైన ప్రేమ అమ్మ

అనురాగ దేవత అమ్మ

అద్భుతమైన స్నేహం అమ్మ

అలుపెరుగని ఓర్పు అమ్మ

నవమాసాలు మోసి, కని పెంచేది అమ్మ

బుడి బుడి అడుగులు నేర్పుతూ, నడిపించేది అమ్మ

అడుగులు తడబడినప్పుడు మనల్ని ముందుకు నడిపించేది అమ్మ

తను నిలువుగా కరుగుతూ మనకు దారి చూపించే దేవత అమ్మ

మన కష్ట నష్టాల్లో మనకు తోడుగా ఉండి, మనల్ని రక్షించేది అమ్మ

అమ్మ ప్రేమ అపురూపమైనది

అద్భుతమైనది

సృష్టిలోనే గొప్పది

– షేక్. సోఫియా
7TH G సెక్షన్

## 6. త్యాగానికి నిర్వచనం



అంతులేని ప్రేమకు అర్థమే అమ్మ

అనంతుడైన దేవుడికి ప్రతిరూపం అమ్మ

ఆ తల్లికెవరు సాటి ఈలోకాన?

అమ్మ అనే బంధమే ఆత్మీయ బంధం

అమ్మ అను పలుకే అత్యంత మధురం

అమ్మ పాలు అమృతం

అనేక పోషకాల మిశ్రమం

అమ్మ జోలగీతం

హాయిగొలుపు సంగీతం

అమ్మంటే సహనం

త్యాగానికి నిర్వచనం

మరపురాని జ్ఞాపకం

మదిలో నిలుచును శాశ్వతం

ఆది పిలుపు అమ్మరా

ఆది గురువు అమ్మేరా

అరుదైన రూపం!

అపురూప కావ్యం!!

అమ్మంటే జననం

జీవానికి ఆరంభం

నిస్వార్థపు జీవితం

నిరుపమాన వ్యక్తిత్వం

– టి. షిలోహ్ జయవర్ధన్
7TH G సెక్షన్

## 7. మమతకు మారుపేరు



అనురాగానికి అర్థం అమ్మ

ఆప్యాయతకు అలవాలం అమ్మ

త్యాగానికి ప్రతిరూపం అమ్మ

నిస్వార్థ ప్రేమకు నిలువుటద్దం అమ్మ

నా అభివృద్ధికి బంగారు బాట

నా ఆశలకు ఆయువు నింపేది

ఊహలకు ఊపిరి పోసేది

నా జీవన గమనంలో మైలు రాయిగా నిలిచేది

ప్రగతి పథంలో దూసుకుపోతుంటే

అందరికన్నా ఎక్కువ సంతోషించేది అమ్మ ..

అమ్మ లేకుంటే నీవు లేవన్నది నిజం

ప్రపంచంలో అందరికంటే అదృష్ట వంతులు

అమ్మ ప్రేమను సంపూర్ణంగా పొందేవాళ్ళే అని నేనంటాను

– ఎస్. అర్చన
7TH J సెక్షన్

## ８. లోకంలో మన తొలి ప్రేమ



అనురాగానికి అర్థం అమ్మ

మమకారానికి మూలం అమ్మ

అలసటకు దూరం అమ్మ

సహనానికి తీరం అమ్మ

నిస్వార్థపు ప్రేమకు గుర్తు

దేవుడు పంపిన నిలువెత్తు రూపం

తెల్లని మీగడ కమ్మదనం

అమ్మ ప్రేమ తీయదనం

నిండు వెన్నెల చల్లదనం

అమ్మ ఒడిలో నులివెచ్చదనం

నాతోనే నిలిచిన అమ్మ

నీ పేరులో ఉంది ప్రేమ!

అమ్మ దీవెన ఆకాశమంత

దేవుని దీవెన దీపమంత

కనీ, పెంచే తల్లి కన్నా లేరు ఎవరూ సాటి

నడకను నాకు నేర్పి, నడతను నీవు చూపి

నా తొలి స్నేహం నీవైనావు

నా తొలి పాఠం నీవైనావు అమ్మ

– పి. యువ రంజని
7TH J సెక్షన్

## ౯. అమ్మ ప్రేమ గొప్పది



అమ్మ అంటే అందరికీ ఇష్టం

అమ్మ ప్రేమ మరువం

అమ్మ నా తొలి గురువు

అనుక్షణం నన్ను కాపాడే దేవత

అమ్మే నా తొలి దైవం

నా పెదవులపై చిరునవ్వు అమ్మ

నా జీవితానికి మార్గదర్శకురాలు

అమ్మ ప్రేమ  విలువ కట్టలేనిది

నా గురించి ఆలోచించే ఆత్మీయ నేస్తం

మా అమ్మ నా జీవితంలో ప్రథమం

అమ్మే నా ప్రపంచం

మంచి విలువలు, అలవాట్లు నేర్పించే గురువు

నా రుచులు తెలిసినది, నా మనసెరిగినది

అందుకే అమ్మ ప్రేమ గొప్పది

– ఎన్. రిషిత ,
7TH J సెక్షన్

## 10. బాధ్యత తెలిసిన అమ్మ



అమ్మ రూపం అపురూపమైనది

అమ్మ ఋణం తీర్చలేనిది

అమ్మ ఆకాంక్ష ఎనలేనిది

అమ్మ ప్రేమ అమితమైనది

కల్మషం లేనిది అమ్మ ప్రేమ

అంకిత భావమే అమ్మ

మనల్ని వెనకుండి నడిపించేది అమ్మ

దేవుడిచ్చిన వరం అమ్మ

స్వార్ధం లేని మమకారం అమ్మ

ఎన్ని యుగాలైన తరిగిపోని ప్రేమ అమ్మ

నా గుండె పలికే ప్రతి మాట అమ్మ

అమృతం కన్నా తీయని పలుకు అమ్మ

ఒకవైపు బంధాన్ని మరొక వైపు బాధ్యతను

సరి సమానంగా మోయగలిగే వ్యక్తి అమ్మ..!

– ఎస్. పార్థ సారథి రెడ్డి
9TH K సెక్షన్

## 11. పదాలకందని ప్రేమ



అమ్మ ప్రేమ కంటే గొప్ప ప్రేమ

అమ్మ కంటే గొప్ప భద్రత

అమ్మను మించిన ప్రేమ మూర్తి

లోకంలో లేదంటే అతిశయోక్తి కాదు

అమ్మ ఋణం

జన్మ జన్మల తీర్చలేనిది

బ్రహ్మ సృష్టిలో అపురూపం

కడుపులో నలుసుగా పడిన నాటి నుండి

ఎన్నో సంఘటనలు ఎదుర్కొని

రక్త మాంసాలను పంచి

నాకు జన్మనిచ్చి, తను పునర్జన్మనెత్తింది

భారతీయ సమాజం 'మాతృ దేవోభవ' అని

అమ్మకే అగ్రతాంబూలం ఇచ్చింది

ఏ చిన్న బాధ కలిగిన

నాకు గుర్తొచ్చేది అమ్మే

అందరికన్నా ముందు స్పందించేది అమ్మే.!

నా బాధను గుర్తించేది

నా మనసుని చదివేది

నన్ను కన్నా అమ్మే..!

ఎంత చెప్పినా ఇంకా మిగిలిపోయేది

పదాలకందనిది అమ్మ ప్రేమ..!

– ఎం. రిథిశ్రీ
7TH G సెక్షన్

## 12. దైవ స్వరూపానివి



అమ్మ తీయటి ముద్దులతో

భూమి మీదకు వచ్చిన నేను

అమ్మ చల్లని ఒడిలో

లాలి పాడించుకొని నిదుర పోయిన నాకు

నీ ఒడి మొదటి బడి అయింది

నా చదువులో గురువువి

అర్థం కాని విషయాలలో స్నేహితురాలివి

అర్ధ రాత్రులు నేను ఎడిస్తే

నీ చేతులు నాకు ధైర్యమయ్యాయి

అమ్మ! నీ అడుగు జాడ నా భవితకు దారి

నీ చక్కటి చేతులతో నా జీవితం దిద్దావు

నా జ్ఞాపకాలలో నిత్యము నిలిచే

దైవ స్వరూపానివి

– డి. యశ్వంత్
8TH C సెక్షన్

## 13. అమ్మ ఒక అద్భుతం



అమ్మ ఒక అద్భుతం

అమ్మ ఒడి ఒక మాయాజాలం

అమ్మ ప్రేమ విశాలం

అమ్మ కోపం గుప్పెడంత

అమ్మ నమ్మకం కొండంత

అమ్మ ఓర్పు గొప్పది

అమ్మ ఋణం తీర్చలేనిది

అమ్మ చేసే త్యాగం మరువలేనిది

అమ్మ మన తొలిప్రేమ

అమ్మ మన నమ్మకం – అమ్మ మన ధైర్యం

అమ్మ మన మొదటి స్నేహితురాలు

అమ్మ మన మొదటి గురువు

మన బాధను చూసి తను బాధపడేదే అమ్మ

– కె. హావీల
9TH K సెక్షన్

## 14. చివరి క్షణం వరకు



కనులు తెరిచిన మరుక్షణం

కనపడే రూపం అమ్మ

తన శరీరం మనకు పంచి

మనకు జన్మ నిచ్చిన దేవత అమ్మ

తన రక్తాన్ని పాలుగా మార్చి

మనకు ప్రాణం పోసింది అమ్మ

మన కాలిలో ముల్లు గుచ్చుకున్న

తన ప్రాణం పోయినంతగా విలవిలలాడేది అమ్మ

మన మౌనాన్ని కూడా

అర్థం చేసుకునేది అమ్మ

మన ప్రాణానికి తన ప్రాణం ఇవ్వడానికి సైతం

వెనుకాడని నైజం అమ్మ

తనకంటూ ఏమి లేకున్నా

అన్ని మన ఎదుగుదల కోసం త్యాగం చేసేది అమ్మ

మన చిరునవ్వును

తన గెలుపుగా భావిస్తుంది

చివరి క్షణం వరకు

మన కొరకు బ్రతుకుతుంది అమ్మ

అమ్మంటే నీలాకాశం

ప్రేమకు ప్రతి రూపం

– ఎస్. అభిజ్ఞ తేజ
9TH K సెక్షన్

## 15. తపించే తల్లి

'అ' అనే అక్షరం తలుచుకోగానే అమ్మే గుర్తుకు వస్తుంది



అమ్మకు ఎప్పుడూ మనం పసి బిడ్డలమే

జగత్తులో అమ్మ ప్రేమను కొలవలేము

అమ్మ కనిపించని ఆదిశక్తి ప్రతిరూపం

అమ్మ చూపించే ప్రేమ వేరెవరి దగ్గర లభించదు

మనల్ని మనం మరిచిపోవచ్చు కానీ

అమ్మ ప్రేమను మరిచిపోలేము

మా ఇంటి గృహ లక్ష్మి

మా పాలిట కల్పవల్లి

నవమాసాలు మోసి, కష్టాలకు ఓర్చి

నన్ను భూమి మీదకు తెచ్చిన అమ్మ

తరువాత తన కష్టాలను మరిచిపోతుంది

అమ్మ ఉండగా కష్టాలు దరికి రావు

తన ఆకలిని తప్పించి మన ఆకలి తీరుస్తుంది

నా కోసం నిరంతరం తపించే ప్రేమమయి

అందుకే

అమ్మంటే మాకెంతో ఇష్టం

అమ్మ లేని లోగిలి నిర్వీర్యమైన వాకిలి

గున్న మామిడి పండు కన్నా

పాలు పెరుగు వెన్న కన్నా

అమ్మ ప్రేమ చాలా మధురం

– డి. విజయ్ నాగ చైతన్య
7TH J సెక్షన్

## 16. తీర్చుకోలేని ఋణం



కనులు తెరిచిన క్షణం

కనపడే రూపం అమ్మ

తన ఆత్మ, శరీరం పంచి

మనకు జన్మనిచ్చిన దివ్య రూపం అమ్మ

నా చిరునవ్వు తన గెలుపు

నా సుఖ జీవితం ఆమెకు లక్ష్యం

అనురాగానికి, సహనానికి అర్థం

మమతకు మారు పేరు

నాకు దక్కే ప్రశంసలు ఆమెకు లభించే ఫలం

త్యాగానికి ప్రతి రూపం

అలుపెరుగని ప్రేమమూర్తి

ఆత్మాభిమానం మెండుగా కలది

కష్టానికి ఊరట నింపేది అమ్మ

నీ ఋణం తీర్చుకోలేనిది అమ్మ

– సి. హెచ్. రిషిక ఆనంది
7TH J సెక్షన్

## 17. సృష్టికి జీవం అమ్మ



మొదటి గురువు అమ్మ

ప్రతి ప్రాణికి మూల కారణం అమ్మ

జన్మనిచ్చే ప్రేమ మూర్తి అమ్మ

ప్రపంచంలో అన్నింటికంటే తియ్యనైన మాట

ఏదన్నా ఉందంటే అది 'అమ్మ' అనే మాట

దైవం కన్నా మిన్న అమ్మ

అమ్మ అనేది కమ్మని మాట

ఎన్నో మమతల మూట

దేవుడు లేడనే మనిషి ఉన్నాడు కానీ

అమ్మ లేదనే మనిషి

వెతికి చూసిన ఎదురుపడడనేది యదార్థం

నా ఉన్నతి కోసం పరితపించే జీవి ఉన్నారంటే

అది అమ్మ మాత్రమే

అనునిత్యం కథలతో, మాటలతో, పాటలతో

నన్ను ఆనందంగా ఉంచేది అమ్మ

తల్లి ప్రేమకు నోచుకున్న బిడ్డే బిడ్డ

తల్లి సేవ చేసుకునే బ్రతుకే బ్రతుకు

అమ్మంటే నాకెంతో ఇష్టం

ఈ జన్మ అమ్మకే అంకితం

– డి. అనుపమ
$7^{TH}$ J సెక్షన్

## 18. మొదటి గురువు



అమ్మ వంటి దేవత భూమి మీద లేదిక

అమ్మ మనసు వెన్న

అమ్మ చేతి వంట అమృతం

అమ్మ నువ్వు ఇచ్చినంత ప్రేమ

భూమి మీద వేరెవరు ఇవ్వగలరు?

నీ చేతి గోరు ముద్ద

నన్ను ఎత్తుకున్న నీ చేతులు

నులివెచ్చని ఒడి

నీ కమ్మని జోల పాట

నన్ను నిద్ర పుచ్చుతుంది

నవ మాసాలు మోశావు

నీ మార్గంలో నడిపించావు

నా మొదటి గురువువి నువ్వే

– ఏ. వార్షిక్
8TH C సెక్షన్

## 19. అమ్మ ప్రేమ గొప్పతనం



నవ మాసాలు నీ గర్భ గుడిలో నన్ను మోసి

పురిటి నొప్పులను సైతం భరించి

నాకు జీవం పోసి, చందమామను చూపి

గోరు ముద్దలు రుచి చూపి

కమ్మని జోల పాటలతో

నన్ను నిద్రపుచ్చిన

ఆ కమ్మని పలుకు అమ్మ

చిలుక పలుకులను నాచేత పలికించి

పలకను నా చేతికందించి

అక్షరాలను నా చేత దిద్దించావు

సృష్టిని సృష్టించిందొక బ్రహ్మ అయితే

అతడినే సృష్టించినది అమ్మ

రెండక్షరాలలో కనిపించే ప్రేమ

మానవాళికి తానొక చిరునామా

కనిపించేది రెండక్షరాల పదం

కానీ ఆమె జీవితపథం

ఎడారిలో కూడా వర్షించే మేఘం

ఆమె చేసే కష్టం ఎన్ని జన్మలెత్తిన

తీరని ఋణం

హద్దులు లేని అనురాగం

మంచితనానికి ప్రతిరూపం

వెలకట్టలేనిది ఆమె మాతృత్వం

బంగారు భవితను నాకందించిన దేవత

అమ్మ గురించి ఎంత చెప్పిన

అది కొంచమే....

– దిల్ అహ్మద్ షేక్
$9^{TH}$ K సెక్షన్

## 20. నమ్మలేని బంధం



అమ్మంటే....

అంతులేని అనురాగం అమ్మ

అంకిత భావం అమ్మ

మనం నమ్మలేని బంధం అమ్మ

మనసుకు శాంతి అమ్మ

మనం పీల్చే శ్వాస అమ్మ

సృష్టికి మూలం అమ్మ

అమ్మ ఒక పిలుపు కాదు

మన తప్పులకు దొరికే క్షమాపణ

అంతులేని మాధుర్యం

మనం తీర్చలేని ఋణం

అమ్మతో ఉన్న అనుబంధం

పెకలించలేని మహా వృక్షం

– చిద్విలాసిని
7TH G సెక్షన్

## 21. **ఆది గురువు**



ఆది గురువు అమ్మ

తీయని పలుకు అమ్మ

కల్మషంలేని ప్రేమ అమ్మ

గుడి లేని దైవం

పెనవేసుకొన్న బంధం

మచ్చలేని మంచితనం

నాకు మొదటి స్నేహం

అమితమైన ప్రేమ

అపురూప కావ్యం

నిరంతర శ్రమ జీవి

హద్దులు లేని ఓర్పు

కలలోనైనా, మెళుకువలోనైనా

నీ దీవెనలే కోరుకుంటాం

– దాసరి ప్రేమ్ కుమార్
7TH F సెక్షన్

## 22. అమ్మ లక్ష్యం



నా ప్రాణం అమ్మ

నాకు ప్రాణమిచ్చిన దేవత అమ్మ

దైవానికి ప్రతి రూపం అమ్మ

తన ప్రాణం కన్న

నా జీవితమే ఆమె లక్ష్యం

నా ఆరోగ్యమే తనకు బాధ్యత

మంచి చెడులను తెలిపేది

నేనడిగినవన్ని ఇచ్చేదీ

నన్ను ఆనందంగా ఉంచేది

చెడు మార్గంలో వెళుతుంటే

సర్ది చెప్పేది అమ్మ

నాకోసం ఏం చేయడానికైనా ముందుండేది

నాకు ధైర్యమిచ్చేది

నిరాశలో నన్ను వెన్ను తట్టేది

నా పసితనం ఎంత బాధ పెట్టిన

నేను సంతోషంగా ఉండాలనుకునేది

కుటుంబంలో అందరి సంతోషమే

ఆమె సంతోషం

మనకోసం ఇంతగా పరితపించే

అమ్మను గౌరవిద్దాం

– ఏ. శ్రీనిధి
7TH J సెక్షన్

## 23. అమ్మ



కళ్ళు తెరిచిన, మూసినా

కనిపించే ప్రతి రూపం అమ్మ

తన రక్తం, శరీరం నాకు పంచిన దివ్య మూర్తి

అమ్మ పాలను మించిన

దివ్యమైన అమృతం ఉన్నదా?

అమ్మ ప్రేమకు, అమ్మ మనసుకు

అమ్మ త్యాగానికి లేదు ప్రత్యామ్నాయం

అమ్మ చేతి ముద్దకు సాటి రాదు

దేవతలు సేవించు అమృతం

అమ్మ ఉన్న ఇల్లు స్వర్గం

అమ్మ లేని ఇల్లు నరకం

అమ్మ ప్రేమని పొందని జీవితం వ్యర్థం

అమ్మకు సాటి లేదు

అమ్మ తనానికి సాటిలేదు

– ఎస్. సాహిన్

7TH F సెక్షన్

## 24. తీయనైన పదం



లోకంలో తీయనైన పదం అమ్మ

లోకంలో నిస్వార్ధమైన ప్రేమ  అమ్మ

భగవంతుని ప్రతిరూపం అమ్మ

తన శరీరాన్ని మనకు పంచే వ్యక్తి అమ్మ

బిడ్డకు కావాల్సిన వసతులు సమకూర్చు కల్పవల్లి

బిడ్డ సంతోషమే తల్లి సంతోషం

బిడ్డ ఆకలి తీరితేనే

తన ఆకలి తీరుతుంది

అమ్మ ఒడి ఒక స్వర్గం

దేనినైన కొనగలం

అమ్మ ప్రేమను కొనలేము

– మహాలక్ష్మి
7TH F సెక్షన్

## 25. అమ్మ



నా జీవితంలో అత్యంత ముఖ్యమైన వ్యక్తి

వర్ణించడానికి మాటలు చాలని వ్యక్తి

తన రక్తం, శరీరం నాకు పంచిన వ్యక్తి

కనులు తెరిచిన క్షణం నాకు కనపడిన రూపం

అమ్మ....

అమ్మ కడుపులో ఉన్న నాడే

అరికాళ్లు కదిలిస్తుంటే

నేను అప్పుడే అడుగులు వేస్తున్నానని

పొంగిపోయింది

మొదటిసారి నేను మాట్లాడితే

మౌనంగా నన్ను చూస్తూ మురిసిపోయింది

మా అమ్మ అందం అపురూపం

దయగల హృదయం

నన్ను జాగ్రత్తగా చూసుకుంటుంది

నేను బడికి వెళ్లేందుకు

సర్వం సిద్ధం చేస్తుంది

తను చెప్పే కథలు

నన్ను మనోహరమైన లోకంలో

విహరింపజేస్తాయి

అటువంటి తల్లికి నేను చేయాల్సింది ఒక్కటే

అమ్మను బాధపెట్టకుండా చూసుకోవడం

సంతోషంగా ఉంచడం

– ఎ. విజిత్ మణికంఠ రెడ్డి
7TH G సెక్షన్

## 26. మాతృదేవోభవ




'మాతృదేవోభవ' అని మొదటి స్థానం

అమ్మకు ఇచ్చింది ఈ లోకం

అమ్మ మన దుఃఖాన్ని తొలగించేందుకు

దిగివచ్చిన దైవం

మన అభివృద్ధిని కోరుకునే

మొదటి వ్యక్తి అమ్మ

అమ్మ అనే పిలుపే

మన హృదయ స్పందన

అమ్మ అనే మాట వెలకట్టలేనిది

హద్దులెరుగని ప్రేమ అందులో ఉంది

అమ్మ ఇచ్చే మానసిక ధైర్యం

అమ్మ చెప్పే మంచి, చెడుల మధ్య బేధం

ఇస్తుంది నాకు ఏదైనా సాధించగలననే సంకల్పం

ఏదైనా అమ్మ ప్రేమ వలనే సాధ్యం

అమ్మ ఉన్న వారి జీవితం

ఇంద్ర ధనస్సులోని రంగులవలే

ఆనందమయం

ప్రతి కష్టంలో దారి చూపే దేవత

అందుకే నేను అంటాను 'మాతృదేవోభవ'

– ఆర్. మిధున్
9TH G సెక్షన్

## 27. అమ్మ



ఈ ప్రపంచంలో మన రూపం కనబడకముందే

మనల్ని ప్రేమించే ఒకే ఒక్క మనిషి అమ్మ

పుట్టే తన బిడ్డ కోసం

ప్రాణాలను పణంగా పెట్టేది అమ్మ ఒక్కటే

సృష్టిలోనే స్వచ్ఛమైనది అమ్మ ప్రేమ

కమ్మనైనది అమ్మ జోల పాట

మధురమైనది అమ్మ మాట

తన ఆకలి చంపుకొనైన

మన కడుపు నింపుతుంది

మన కడుపు నిండితేనే

తన కడుపు తృప్తి పడుతుంది

మంచి అలవాట్లు

నైతిక విలువలు నేర్పే

నా జీవిత మార్గదర్శకురాలు

నాకు ఇష్టమైన వంటలతో నన్ను తృప్తి పరుస్తుంది

నా చదువులో సాయం చేస్తుంది

మా అందరి కోసం ప్రార్థిస్తుంది

ఏ ప్రాంతంలోనైనా

ఏ దేశంలోనైనా

సంస్కృతులు మారవచ్చు కానీ

అమ్మ ప్రేమ మారదు

అమ్మకు ఎప్పుడూ నా గురించే ఆలోచన

నా మీదే ధ్యాస

అమ్మ నాకొక గొప్ప స్నేహితురాలు

కొట్టినా, తిట్టినా

అమ్మ మీద తగ్గదు ప్రేమ

– జి. షాన్

7TH F సెక్షన్

## 28. మాతృమూర్తికి వందనం



అమ్మ..! ఒక నిజం

ఒక మధురమైన భావన

కనేటప్పుడు కడుపులో

కన్నాక కళ్ళల్లోను, జీవితాంతం గుండెల్లోను

పెట్టుకుని చూసేది

అమ్మ కనీ పెంచేదే కాదు.. కనిపించే దైవం కూడా

దేవుడైన ఈ లోకంలోకి రావాలంటే

తల్లి గర్భాన్ని ఆశ్రయించాలి!!

ప్రతి బిడ్డకూ తొలి గురువు అమ్మ

నీకు 70 ఎళ్ళు వచ్చినా ..

ఏమైనా తిన్నావా? అని అడిగేది లోకంలో అమ్మే!

నువ్వు విసుక్కున్న, కసురుకున్న

ఆస్తి రాయలేదని ద్వేషించినా

ఆఖరికి తనని ఒంటరిని చేసి

ఏ వృద్ధాశ్రమంలోనో చేర్చి

నీ భార్య పిల్లలతో నువ్వు హాయిగా ఉన్నా

పోనీలే అని సంతోషించే నిస్వార్థ వ్యక్తి అమ్మే!

ఆ మాతృమూర్తికి వందనం

శతకోటి వందనాలు

– గండూరి. మేరీ సుశ్రిత
9TH D సెక్షన్

## 29. అన్నీ తానే



అమ్మంటే నాకన్నీ తానే

నన్ను సృష్టించిన బ్రహ్మ తానే

ఆకలి తీర్చిన అన్నపూర్ణ తానే

నా కష్టంలో మార్గదర్శి, దిక్సూచి తానే

భయమేసినప్పుడు ధైర్యం చెప్పే తోడు తానే

నా అనారోగ్యంలో వైద్యురాలు తానే

సంతోషాన్ని, బాధను పంచుకునే మిత్రురాలు తానే

నడతను దిద్దే గురువు తానే

దారి తప్పితే మార్గం చూపేది తానే

మా ఇంటికి వెలుగు తానే

నా సంతోషం తానే

అన్నీ తానే.. అంతా తానే

– కె. జహిత
9TH J సెక్షన్

## ౩౦. గొప్పప్రేమ



అమ్మ ప్రేమను మించిన గొప్ప ప్రేమ లేదు

కళ్ళు తెరచిన క్షణం నేను చూసిన అందం అమ్మ

తన శక్తిని పాలుగా మార్చి, నాకు శక్తిని నింపింది అమ్మ

ప్రేమ అనే పదానికి అర్థం అమ్మ

నీ ప్రేమ అమూల్యమైనది అమ్మ

నీ ఋణం నేను తీర్చుకోలేనిది అమ్మ

నాకు చిన్న దెబ్బ తగిలినా విలవిలలాడేది అమ్మ

నా మనసులోని భావం సైతం అర్థం చేసుకోగలదు అమ్మ

'అ' అంటే నేను నేర్చుకొన్నది అమ్మ

నాలో ఊరట నింపేది అమ్మ

నాకు ఆనందం ఇచ్చేది అమ్మ

అందరినీ ఆదరించేది అమ్మ

– పి. కీర్తి
7TH J సెక్షన్

## 31. వర్ణించలేని అమ్మ ప్రేమ



అమ్మ ఈ జన్మ నీవిచ్చిన బహుమానం

లేదు ఈ లోకంలో నీ ప్రేమకు కొలమానం

సర్వ జీవకోటికి నీవేలే ఆధారం

ఎంత గొప్ప వారైనా నీ ప్రేమకు దాసోహం

నీ రక్త మాంసాలు ముద్దగా చేశావు

నీ ప్రాణమే పణంగా పెట్టి మాకు జన్మనిచ్చావు

క్షీరామృతాన్ని మాకు పంచావు

ముక్కోటి దేవతల సమరూపం నీవమ్మా !

అంత ప్రేమ వర్ణించగా నా తరమా!!

వేలు పట్టి బుడి బుడి అడుగులతో నన్ను నడిపించావు

ఉగ్గు పాలతో నాకు జోల పాడావు, కథలెన్నో చెప్పావు

స్వర్గమే చిన్నబోతుంది నీ ముందు

– వి. రాహుల్
9TH D సెక్షన్

## 32. తొలి గురువు



లోకంలో అడుగు పెట్టిన క్షణం

నేను తాకిన వెచ్చని స్పర్శ అమ్మ

పాలు వంటి స్వచ్ఛమైనది అమ్మ ప్రేమ

తెలుగు భాషలోని మధురమైన రెండు అక్షరాల పదం అమ్మ

మన బాధ చూడలేక విలవిలలాడేది అమ్మ

భగవంతుడు అందరికీ సమానంగా ప్రేమను పంచడానికి

అమ్మను సృష్టించాడు

మన జీవితానికి తొలి దేవత అమ్మ

అమ్మ ప్రేమని మించిన ప్రేమ లేదు

మంచి మార్గంలో పయనించడానికి

మనకు తోడుగా ఉండే వ్యక్తి అమ్మ

తన చివరి క్షణం వరకు మన కోసం బ్రతికేది అమ్మ

స్వార్థం లేని వ్యక్తి అమ్మ

విశాలమైన ప్రేమకు ప్రతిరూపం అమ్మ

మమకారానికి అర్థం అమ్మ

– పి. జస్వంత్, 9TH D సెక్షన్

## 33. త్యాగ శీలి



అమ్మ ప్రేమ ఆకాశం కంటే విశాలం

సాగరం కంటే లోతు అమ్మ ప్రేమ

తేనె కంటే తీపి అమ్మ మనసు

కోకిల గొంతు కన్నా మధురం అమ్మ మాట

కొవ్వొత్తిని మించినది అమ్మ త్యాగం

నేల తల్లిని మించినది అమ్మ ఓర్పు

ఓర్పు అంటేనే అమ్మ

ఏది మిన్న తల్లి ప్రేమ కన్నా

– పి. నాగ మోహన్ సాయి
9TH D సెక్షన్

## 34. దేవుడిచ్చిన బహుమతి



అమ్మ దైవంతో సమానం

అమ్మ లేనిదే జగతి లేదు

మనకు జన్మనిచ్చేది అమ్మ

అమ్మ ఒడిలోనే అన్నీ నేర్చుకుంటాము

9 నెలలు తన గర్భాన మోసి

మనకు జన్మనిస్తుంది

తన ప్రేమతో

బయట ప్రపంచాన్ని కూడా మరచిపోతాము

తల్లి తర్వాతే తండ్రి బాధ్యత వహిస్తాడు

మన మీద పూర్తి బాధ్యత వహించేది తల్లి మాత్రమే

మంచైనా చెడైన తల్లే చూసుకుంటుంది

విద్యా బుద్ధులు నేర్పిస్తుంది

లోకజ్ఞానం తెలియజేస్తుంది

మనం ఏం చేసినా కడుపులోనే దాచుకుంటుంది

తల్లి దేవుడిచ్చిన బహుమతి

మనకు ప్రత్యక్ష దైవం

ఎన్ని జన్మలెత్తినా తల్లి ఋణం తీర్చుకోలేనిది

తల్లి లేనిదే మన జీవితం వ్యర్థం

అమ్మ గురించి ఎంత చెప్పినా తక్కువే

– గుత్తికొండ. గౌతమ్
శంకర్,7TH F సెక్షన్

## 35. **నా దైవం**



గుడి లేని దైవం అమ్మ

కల్మషమెరుగని ప్రేమ అమ్మ

అమృతం కన్నా

తీయనైన పలుకు అమ్మ

నా గుండె పలికే ప్రతి మాట అమ్మ

హద్దులెరుగని ప్రేమకు రూపం అమ్మ

దయ కలిగిన ప్రార్థన అమ్మ

నిరాశ చెందని ఆశ అమ్మ

స్వార్థం కాని నిస్వార్థం అమ్మ

శతకోటి నమస్కారాలు అమ్మకే

మన తొలి ప్రేమ అమ్మ, తొలి నమ్మకం అమ్మ

మన సంతోషం అమ్మ, మన బాధని తగ్గించేది అమ్మ

అన్నీ తానై నిలిచిన అమ్మకు ఏమి ఇవ్వగలను..

ఈ నా తొలి కవితను తనకి అర్పిస్తున్నాను

– జి. హారిక, 9TH E సెక్షన్

## 36. నా ప్రపంచం



నా జీవితం లో మొదటి సగం అమ్మ
తన రూపాన్ని జన్మనిచ్చి
ముసిముసి నవ్వులను చూసుకొని మురిసిపోయేది అమ్మ
మన మీద ప్రేమను దాచుకోలేని వ్యక్తి అమ్మ
అమ్మ ప్రేమ ఎవ్వరినైనా మరిపించగలదు
కానీ అమ్మను ఎవరూ మరిపించలేరు
నిజం చెప్పాలంటే ఈ ప్రపంచంలో
నిజమైన ప్రేమను ఎవరూ ఇవ్వలేరు
ఒక్క అమ్మ తప్ప
తన ప్రాణం పోతుందని తెలిసిన
మనకు ప్రాణం పోసి
పదిలంగా ప్రపంచానికి అందించే దేవత అమ్మ
పదాలు రాని నా పెదవులకు
అమృత వాక్యం అమ్మ
అందుకే నా ప్రపంచం అమ్మ

– ఎ. ప్రశాంతి
9TH D సెక్షన్

## 37. అన్నీ అమ్మే



మనం పుట్టిన తర్వాత
మనం పలికే మొదటి మాట అమ్మ
అమ్మతో అనుబంధం మరువలేనిది
అమ్మ ప్రేమ కమ్మనైనది
అమ్మ ఋణం తీరలేనిది
అమ్మ దీవెన దివ్యమైనది
మనం పుట్టినప్పటి నుండి మరణించే వరకు
ఏ లోటు లేకుండా చూసుకునేది అమ్మ
అమ్మ ధైర్యం ఇస్తుంది
అదే అమ్మ నేను తప్పు చేస్తే దండిస్తుంది
నా గురించి నేను ఆలోచించకముందే
అమ్మ నా గురించి ఆలోచిస్తుంది
అమ్మ ఋణం కోట్లు పెట్టినా కొనలేము, తీర్చలేము
అమ్మ ఉంటేనే మన జీవితానికి అర్థం
అమ్మ లేని జీవితం వ్యర్థం, అమ్మ లేని జీవితం భారం
అమ్మే మన జీవితానికి అర్థం

– ఎల్. అంకిత్
9TH D సెక్షన్

## ౩౮. అమ్మ



అమ్మ గుడిలోని దేవత

అమ్మ చూపించే ఒరవడి

అమ్మ చెప్పే మంచి మాటలు

అమ్మ పెదవులపై చిరు నవ్వు

అమ్మ నాన్నలకు నా మీద ఉన్న ప్రేమ

మాటల్లో చెప్పలేనిది

అమ్మే నాకు ధైర్యం

అమ్మే నా జీవితం

అమ్మే నాకు గర్వం

– సంజయ్
9TH G సెక్షన్

## 39. అంతం లేని అమ్మ ప్రేమ



తుఫాను కైనా ముగింపు ఉంటుంది కానీ

అమ్మ ప్రేమకు ముగింపు లేదు

మనకు ప్రమాదం వస్తే పట్టించుకోనివాళ్ళు పరాయి వాళ్ళు

ప్రమాదమని తెలిస్తే రక్షణగా నిలిచేది అమ్మ

తిండి లేకుండా బ్రతకలేము మనం

పిల్లలు లేకపోతే బ్రతకలేదు అమ్మ

నాన్న కష్టాలు తెలుసుకొని తీరుస్తాడు

అమ్మ కష్టాలు రాక ముందే తీరుస్తుంది

మనం తప్పు చేస్తే మందలించే వాడు నాన్న

మన తప్పుని సరి దిద్ది చెప్పేది అమ్మ

ఎక్కడ తిన్న, ఏమి తిన్న అమ్మ గోరు ముద్ద కన్న

మధురమైన బోజనం లేదు

– లిఖిల శ్రీ
7TH F సెక్షన్

## 40. అమ్మే అమృతం



అమ్మ అంటే అమృతం

అమ్మ లేనిదే మనం లేము

తొమ్మిది నెలలు ఎంతో శ్రమించి

బిడ్డను కనే మహా మాత

పిల్లలను ఎంతో ముద్దుగా పెంచుతుంది

తన కన్నా తన పిల్లలపైనే

ఎక్కువ ప్రేమ చూపుతుంది

పిల్లల కోసం ఎన్నో త్యాగం చేస్తుంది

అమ్మ ఒక దైవం

అమ్మ మన మొదటి గురువు

పుట్టగానే మనం చూసే మొదటి వ్యక్తి అమ్మ

చల్లని ముద్దులతో ఆడిస్తుంది

తన మాటలతో పద్దతి నేర్పుతుంది

అమ్మంటే  అమృతం

– సిహెచ్. వెంకట శాన్విత్
7TH J సెక్షన్

## 41. అమ్మ ఋణం తీరనిది



అమ్మంటే నాకెంతో ఇష్టం

అనురాగానికి అర్థం అమ్మ

మమకారానికి మూలం అమ్మ

ఆప్యాయతకి నిలువెత్తు నిదర్శనం అమ్మ

మమతకు మారు పేరు అమ్మ

అందమైన భావం అమ్మ

కనిపించే దేవత అమ్మ

మరువలేని బంధం అమ్మ

మన ఊహలకు ఊపిరి అమ్మ

అమ్మంటే ఇష్టం లేని వారు లేరు

ప్రపంచంలో అదృష్టవంతులు

అమ్మ ప్రేమ దక్కిన వారు

అమ్మ ఋణం తీరనిది

అమ్మ ప్రేమ వర్ణించలేనిది

– ఎం. కార్తీక
7TH J సెక్షన్

## 42. కనిపించే దైవం



అమ్మ కనిపించే దైవం

కొలవలేని త్యాగం

నవమాసాలు మోసి

బిడ్డను కంటుంది అమ్మ

తాను పడిన కష్టం బిడ్డను చూడగానే మరిచిపోతుంది

కుటుంబం కోసం

భర్త కోసం, పిల్లల కోసం

తన సుఖాలను త్యాగం చేస్తుంది

పిల్లల కోసం ప్రాణ త్యాగమే చేయగలదు

ఆమె ప్రేమ అంతం లేనిది

కల్మషం లేనిది, వెల కట్టలేనిది

మన వెన్నంటి నడిపిస్తుంది

అమ్మని ప్రేమించేవారికి

అంకితం ఈ కవిత

– బాల శివ సుబ్బారెడ్డి
9TH K సెక్షన్

### 43. **ఆశల ఆయువు**



గోరు ముద్దలు తినిపించేది

గారాబంగా చూసుకునేది

నా ఊహలకు ప్రతి రూపం

నా ఆశలకు ఆయువు

మమతకు మారు పేరు అమ్మ

కళ్ళు తెరిచిన క్షణం

కనిపించే రూపం

నా పెదవిపై చిరునవ్వు

నా జీవన గమనంలో మైలు రాయిగా నిలిచేది

గాయాలకు ఔషధంగా మారేది

కంటికి రెప్పలా కాపాడేది

గుడి లేని దైవం అమ్మ

మా అమ్మే నాకు దైవం

మా అమ్మే నాకు ప్రాణం

– టి. సోను విజయ అధీర
9TH E సెక్షన్

## 44. అమ్మ ప్రేమ



అమ్మ అనే పదం కమ్మనైనది

అమ్మ లేని జీవితం భారమైనది

అమ్మ మనసు కల్మషం లేనిది

అమ్మ కన్నా నాకు ఎవరు మిన్న!

అమ్మ ప్రేమ అమృతం

అమ్మంటే అభిమానం, అనురాగం

అమ్మ ప్రేమ చిరుజల్లు

నింగిలోని హరివిల్లు

అమ్మ నాకు తొలి బంధం

అమ్మ నీడన సురక్షితం

అమ్మ ప్రేమను కొనలేము

ఆకలంటే అన్నం తినిపించావు

నిద్ర పోవాలంటే కథలు వినిపించావు

అందుకే అమ్మంటే ఇష్టం

– డి. జస్వంత్ రెడ్డి
7TH J సెక్షన్

## 45. అమ్మ ఋణానుబంధం



భగవంతుని ఉత్తమ సృష్టి అమ్మ

ప్రేమ, దయ త్యాగానికి ప్రతీక అమ్మ

నా జీవితానికి ఒక బడి, గుడి అమ్మ

ప్రతి ప్రాణికి మూల కారణం అమ్మ

మనల్ని చూడకముందే మనల్ని ప్రేమించే మనిషి అమ్మ

కనిపించని దేవుడు కూడా

కనిపెంచిన అమ్మ తర్వాతే

నా చిరునవ్వు మాత్రమే తెలిసిన మిత్రుడు కన్నా

నా కన్నీళ్ళ విలువ తెలిసిన అమ్మ నాకు మిన్న

దేవతలు ఇచ్చే వరాల కన్నా

అమ్మ ఇచ్చిన జీవితం మిన్న

తను చనిపోతున్నాని తెలిసినా

కన్నీటి కష్టంతో బిడ్డను బ్రతికిస్తుంది అమ్మ

అమ్మతో ఉన్న ఋణానుబంధం వర్ణించలేనిది

– ఎస్. గీతిక
8TH C సెక్షన్

## 46. దేవుడిచ్చిన వరం



మా అమ్మ నాకు

దేవుడిచ్చిన పెద్ద వరం

దేవుడు కూడా అమ్మ గర్భాన జన్మించిన వాడే

అమ్మ తొలిసారిగా అందించే చనుబాలు

మనకు అమృతం

ప్రాణ త్యాగమైనా సరే

మనకోసం అమ్మ మాత్రమే చేయగలదు

నవమాసాలు కడుపున మోసి

బాధలు భరించి బిడ్డకు జన్మనిస్తుంది

మనం జన్మలో మరిచిపోలేని మధుర జ్ఞాపకం అమ్మ

మా కోసం ఎన్నో పనులు చేస్తుంది

చదువులో సాయపడుతుంది

రుచికరమైన పదార్థాలను పెడుతుంది

ప్రేమ, జాలి, దయ శాంతికి ప్రతి రూపం

– బెల్లంకొండ సూర్య
మణిదీప్, 7TH F సెక్షన్

## 47. అమ్మ ప్రేమ



మమతకు మారు పేరు అమ్మ

అనురాగానికి అర్థం అమ్మ

మనకు కనిపించే దేవత అమ్మ

అమ్మకుండే సహనం ఎవరికీ ఉండదు

స్వచ్ఛమైన ప్రేమ అంటే అమ్మదే

జీవితంలో దురదృష్టం అంటే

అమ్మ ప్రేమను పొందలేకపోవడం

అమ్మ లేకపోతే నీవు లేవు

అమ్మ వంటి త్యాగమూర్తి ఎవరూ లేరు

తన పిల్లల కోసం, తన భర్త కోసం ఎన్నో త్యాగాలు చేస్తుంది

అమ్మను, అమ్మ ప్రేమను అర్థం చేసుకోలేని వారు మూర్ఖులు

అమ్మ వంటి తీయటి మాట ఇంకొకటి లేదు

మన విజయాన్ని మనకన్న ఎక్కువగా ఆనందించేది అమ్మ

తన పిల్లల అల్లరి పనులు

బుజ్జి మాటలు చూసుకొని  ఆనందించేది అమ్మ

తన నిదురలో కూడా బిడ్డ జాగ్రత్తని గమనిస్తుంది అమ్మ

నా జీవితంలో అతి ముఖ్యమైన వ్యక్తి అమ్మ

అందుకే నా మొదటి కవిత

మా అమ్మకే అంకితం

– గుదిబండి. వైష్ణవి రెడ్డి
9TH E సెక్షన్

## 48. అమ్మకు ప్రేమతో..



నేనే తానుగా – తానే నేనుగా మలిచింది "అమ్మ"

అమృత తుల్యం – చిరునవ్వుల సాగరం "అమ్మ"

సంతోషాల పెన్నిధి – ఆప్యాయతల లోగిలి "అమ్మ"

కలలకు ప్రతిరూపం – కావ్యానికి తుది రూపం "అమ్మ"

పవిత్రతకు మరో రూపు – స్వచ్ఛతకు మారు రూపు "అమ్మ"

మమతల కోయిల – మానవతకు ఊయల "అమ్మ"

వికసించిన మందారం – భవిష్యత్తుకు ఆధారం "అమ్మ"

విసుగెరుగని మనస్సు – వసంత కాల ఉషస్సు "అమ్మ"

ఎన్నో చేసేది "అమ్మే" – ఎన్నో తిట్టేది "అమ్మే"

ఎంతో విలపించేది "అమ్మే" – ఎంతో ఇచ్చేదీ "అమ్మే"

భవిష్యత్తుకు బంగారు రూపం "అమ్మే"–భవితకు భంగారు స్తూపం "అమ్మే"

అనిర్వచనీయం "అమ్మే" – అనుభవైకవేద్యం "అమ్మే"

వెల కట్టలేని ఋణం "అమ్మే" – బాధలో గుర్తొచ్చే దైవం "అమ్మే"

అనుక్షణం తపించేది "అమ్మే" – అహర్నిశం శ్రమించేది "అమ్మే"

చరిత్రలో చెరగని పాఠం "అమ్మే" – చరితలో చెదరని స్వప్నం "అమ్మే"

అమ్మకు రారు సాటి – అమ్మకు లేరు పోటీ

ఎన్నో ఇచ్చిన "అమ్మ" – ఎన్నో చేసిన "అమ్మ"

నా ఎదుగుదల "అమ్మ" – నా ధైర్యం "అమ్మ"

సుధీర తీరాలకేగిన అమ్మ – నే మరువను నీ ప్రేమామృతం "అమ్మ"

వర్ణించలేని బాధతో – కన్నీటి ధారతో

ఈ కవిత నీకు అంకితం "అమ్మ"

–పరుచూరి వెంకట సాయి గణేష్

12TH B సెక్షన్